# తుమ్మల సీతారామమూర్తి చౌదరి

# 1901

కమ్మవంశీయులు. తల్లి: చెంచమ్మ. తండ్రి: నారయ్య. జన్మస్థానము: గుంటూరు మండలములోని కావూరు. జననము: 25-12-1901. రచనలు:- ౧. ఆత్మకథ ౨. రాష్ట్రగానము ౩. ఆత్మార్పణము ౪. ధర్మజ్యోతి. ౫. అమరజ్యోతి ౬. పఱిగపంట. ౭. పెద్ద కాపు [కావ్యములు] ౮. మహేంద్రజననము [నాటకము] ౯. రామలింగేశ్వర శతకము ౧౦. రామశతకము ౧౧. గాంధీతారావళి — మున్నగునవి.

తెలుఁగువారి కవితా శాఖలో నిరువదవ శతాబ్దివచ్చి వసంతరేఖలు దిద్దినది. ఈ శతాబ్ది యవతారముతోపాటు జన్మించిన కవి తుమ్మల సీతారామమూర్తి చౌదరి. ఆయన కృతులు ఆంధ్రరాష్ట్రమున గానము చేయఁ బడుచున్నవి. వారి "రాష్ట్రగానము" పేరు విననివా రుండరు. సీతారామమూర్తి చౌదరిగారు మహాత్ముని "ఆత్మకథ" కావ్యరూపముగా సంతరించిరి. అది సుప్రసిద్ధము. ఆయన ధర్మజ్యోతి, అమరజ్యోతి, పఱిగపంట, పెద్దకాపు ఇత్యాదులు యువరసికులకు నిత్యపారాయణమున నున్న కృతులు.

పుత్తెకొక్క బుద్ధి పుట్టు జిహ్వకు నొక్క
రుచి జనించు నంట రూఢిమైన
నరసులెల్ల మెచ్చ మెఱయింతుఁ గైతలోఁ
గమ్మఁ దనము మత్కులమ్మువలె.

ఇది చౌదరిగారి నియమము. ఈ నియమము తప్పకుండ కమ్మని కవిత గల కూర్పులు మనకెన్నో వా రందిచ్చిరి. తొల్లింటి కవుల ధర్మములు పీసమెత్తు కావనుటకు వీ రిష్టపడరు. రస భావ పరిపుష్టమైన రచనావైదగ్ధ్య మాయనలో వలసినంత యున్నది. భాష నిర్దుష్టము;

పలుకుబడి బింకమైనది. ప్రాఁతమాటలకు క్రొత్త పూఁతపూయు కూర్పు నేర్పు చౌదరిగారి కెన్నఁడో యలవడినది. ధర్మనిష్ఠకు నుదవిష్టమైన యితివృత్తము లాయన యేఱుకొనఁ గలవారు. ఉభయ భాషలయందును చక్కని సాహిత్యము. సంస్కృతాంధ్ర శబ్దముల బరువులు, తరుపులు పట్టిచూచి, తూఁచి పద్యములలో సంధానింపఁ గలుగుటలో సీతారామమూర్తికవి చేయితిరిగిన చతురుఁడు. సుశిక్షితులైన కవులు నేఁటివారిలోఁ బలుచబడుచున్నా రన్నమాట కొందఱికి కోపకారణము కారాదు. చౌదరిగారివలె ధారాళముగాఁ గవిత కట్టువారు లేరనికాదు. ఈ సౌభాగ్యమునకుఁ దోడు సౌష్ఠవము కూడ నుండవలయును. దానికి, సంస్కృతాంధ్ర కావ్య పరిజ్ఞానమేకాక, వ్యాకరణ ప్రవేశముకూడ విధిగా నుండవలసినది. ఈయుభయము మన సీతారామమూర్తి చౌదరిగారిలో నున్నవి. ఈ యుస్తిత్వము చూచుకొని పండితకవులును వీరిని గౌరవించుచున్నారు. విద్వత్కవులగు తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారితోఁ గాళిదాసత్రయము చౌదరిగారు పాఠముచేసిరి. ఆయన యాచార్యకము వీరి భాషజీవితమున కొక మేలిదారి నగపఱిచిన దన వచ్చును. ఈ కృతజ్ఞత చౌదరిగారిలో నున్నది.

ఏకశ్లోక రహస్య బోధనముచే నెవ్వాఁడు శిష్యున్ సుధీ
లోకాగ్రేసరుఁ జేయు నవ్విబుధుఁ గొల్తున్ వెంకటప్పాఖ్య న
స్తోక శ్లోక మయూఖరాజదభిలాషున్ రామగాథామృతా
ఖ్యాక గ్రంథమతిల్లికా జనకు మద్గైర్వాణ భాషాగురున్.

౧౯౩౦ లో వీరు ఉభయభాషాప్రవీణ పరీక్షలో నుత్తీర్ణత సందినారు. చిట్టిగూడూరు పాఠశాలలో వీరికి గురుత్వము నెఱపిన శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారిని గూర్చి 'ఆత్మకథ' లో నిటులు స్తుతి చేయుచున్నారు.

"శబ్దశాస్త్రాది లక్షణ సంప్రదాయ
మెవ్వఁ డెఱిఁగించె నాకు నయ్యుద్ధ చరితుఁ
బ్రస్తుతించెదఁ బుంభావ పద్మజాత
రమణి దువ్వూరి వేంకటరమణ శాస్త్రి"

ఈ యుదాహరణము లెంచు కనఁగా, సీతారామ మూర్తి చౌదరి గారు గాలిచదువు చదివిన వారుగాక గురుకుల క్లిష్టులై శాబ్దాదుల యందుఁ గృత పరిశ్రమ లనుటకు - వాస్తవమునకు, వారియేపద్యము పట్టి నను, ఈవిషయము వెల్లడి యగును. "ఉభయతోముఖ గవాయుత దాన ఫలదాత్రి" - "దేశభక్తి పదవీ నదవీయసి" "తచ్ఛ్రవణ సాహితి దుశ్శక మెట్టివారికిన్" - "పుంవవు రీడ్యమాన" "శ్రద్దధానుఁడు" - "రామాభిధానపు న్నిర యార్చిరంగ" - ఇత్యాదులైన రహస్యములు శిక్షితునకుఁగాని తెలియనివి. ఇట్టివి చౌదరిగారు కృతులలో వందలు వాడినారు. అట్లని, కేవల ప్రయోగ వ్యామోహము కలవారే యను కొనరాదు. రసదృష్టిలోఁ జూచినను వారి రచనలకు మంచి స్థానమున్నది. శయ్యా సౌందర్యము మంచిది. భావనయు గంభీరమైనది. ఆవేశమును ప్రశంసనీయమైనది. పోకడలు ధర్మనిష్ఠానిష్ఠితము లయినవి. ఇఁక వారి ధోరణి యెటు లుండును? అందులో, నిండుగాఁ దెలుఁగుఁ దనమును పలచిన రచయితలు చౌదరిగారు. పరభాషా-వేష సంస్కార సంపర్కములు బొత్తిగా నీయనకు నచ్చవు. జాతీయ మైన పరమ ధర్మము నీయన దివ్యమంత్రముగా నుపాసించుచున్నారు. ఆయన రాష్ట్రగానాదులు దీనికిఁ దారకాణగా నిలఁబడురచనలు. క్షేత్ర జీవులు, ఆదర్శజీవులు, శిథిలక్షేత్రములు - ఇవన్నియు చౌదరిగారి కవితా వాహినీ పూరములోఁ బరిపూతములగు వస్తువులు.

అమ్మ తల్లులవంటి యావు లింటింటిలోఁ
గదుపులై యమృతంబు పిదుకఁజేసి
కండబంకము జూపి కొండలైనను మోసి
కలుము లందిచ్చుగిత్తలను బెంచి
పనిముట్టుగాని సంపద ముద్దుగా దన్న
జీవసూత్రము శిరసావహించి
గొడగరి పద్దులంగి గోసంగి కనుదోయి
దైన్యరేఖలకు జోడవ్యోసర్చి
కదురుగలచోటు కవ్వంబు కదలుచోటు
కఱవులకు ధూమకేతువుగా నెగలంగి
త్యాగమున కాశ్రయము కర్మయోగి వగుచుఁ
గీర్తిఁగనవయ్య భారతక్షేత్రజీవి!

*

బెబ్బులివంటి మా తెలుఁగుబిడ్డ మగంటిమి మున్ను ప్రతిమన్
బొబ్బిలికోటలో నుబికి పొంగి పరాసుల ముందిముంచి త
బ్బిబ్బొనరించి శాత్రవుల బిట్టుపొగడ్తలఁ గాంచదా? జగం
బబ్బురమంద నాఁచికొనదా? శరదిందువికాసకీర్తులన్.

*

కమ్మనిమాటలాడి నయగారము జూపినమాత్రఁ జప్పు పె
ట్టమ్ముల నాయకత్వ మిసుమంత సహింపఁడు తెల్గుబిడ్డ; శౌ
ర్యమ్ము సముంచితోజ్జ్వలపరంపర బట్టు విలార్పు సత్కి
క్రమ్మరుచున్నవాఁ; డతనికోర్కె లెన్నటికిన్ ఫలించునో!

ఈ తీరయిన జాతీయావేశముగల కవులు తక్కువ. ౧౯౩౧లో పన్నుల నిరాకరణోద్యమమున మన చౌదరిగారు జరిమానా శిక్ష పొందెను. అదిగాక, గుంటూరుజిల్లా కాంగ్రెసు సంఘములో పెరు

పదేండ్లపాటు సభ్యులై జాతీయ ప్రబోధము గావించినారు. రాట్నము, గాంధి, అస్పృశ్యత, పంజాబువధలు, భారతమాత ఇత్యాదిశీర్షికలతో వీరు రచించిన పద్యములు తెలుఁగు చదువరులకు సుపరిచితములు. వీరి యాదర్శములకుఁ దగినటులుగా మహాత్ముని యాత్మకథ మధురమైన కావ్యముగా సంతరించినారు. ఈరచన లిటులు సాగించుచునే దుగ్గిరాల, బాపట్ల, నిడుబ్రోలు, అప్పికట్ల హైస్కూళ్లలో నాంధ్రోపాధ్యాయ పదవి నిర్వహించి శిష్యుల నెందఱనో దిద్దినారు. ప్రకృతము వీ రుపాధ్యాయ పదవియందే యున్నారు.

ఈయభినవ తిక్కననుగన్న తలిదండ్రులు ధన్యులు. చౌదరిగారితండ్రి నారయ్య ధర్మజ్యోతి. ఆయన శీలసంపద శాశ్వతమైన కృతిగా సంతరించి, యీపుత్త్రుఁడు మనకిచ్చెను. జనకునిపై తనయునకుఁ గల భక్తిగౌరవము లకేకాక, నీతి నిష్ఠావిశేషమునకు, రసభావ సౌష్ఠవములకుఁగూడ 'ధర్మజ్యోతి' తారకాణమైన కావ్యము. చౌదరిగారు తండ్రినిగూర్చి యిటులు వ్రాయుచున్నారు :

చదువకయున్ననేమి బుధసత్తము లుబ్బఁగ నర్థభావసం
పద వికసింప భాగవత భారతముల్ వివరించు; హృద్యముల్
తదమలకావ్యపద్యములు ధారణ కగ్గముచేసి వేనవేల్
చదువునతండు; తచ్ఛ్రవణసాహితి దుశ్శక మెట్టివారికిన్.

మక్కువమై కొండికనాఁ
డక్కఱగల యుడ్డు! లేనియప్పుడు నోఱపో
చక్కట్ల దండ లాతఁడు
పెక్కులు మన్మ్మదుల హృదయపీఠికఁ జుట్టెన్.

సౌజన్యమూర్తియగు "తుమ్మల" కవికి ౧౯౪౭ లో, కనకాభిషేక గౌరవము జరిగిన సందర్భమున శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి యధ్యక్షుఁడుగా విప్పిన హృదయ మిట్లున్నది.

"మన చౌదరి యతిప్రాసములకై భంగపాటుచెంది తలగోఁకి కొనుచు బలాత్కార పద ప్రయోగములుచేసి, యర్థము ననుసరించి పదములు వాడక, పదములఁబట్టి యర్థమును వంపులువెట్టి వంకఁజేయు నీరసుఁడు గాఁడు. భావ మనర్గళముగాఁ బ్రవహించు చందాన వ్రాయు మహనీయుఁడు. యతి పదాదియందే కాక మధ్యమునను గూసలు వ్రాలును. ప్రాసమునకు యతికినై పద్యము నడక నిలిచి దాఁటవలసిన యిబ్బంది లేదు. అర్థమునుబట్టి పదములు, పదములలో లీనమైనరీతిని యతిప్రాసములు ననాయాసముగ నప్రయత్నముగ, స్వచ్ఛందముగ వచ్చి చేరు చుండును. ఈసిద్ధియందుఁ బ్రసిద్ధుఁడు తిక్కన. ఈవర్గమున తిక్కనతో సజాతీయుఁడైన వాఁడు మన చౌదరి. అనఁగా సరి సమానుఁడని యతిశయోక్తిఁ బలికి ప్రమాదము చేయను. ఆవర్గమున సగ్రామసత్వము లేకున్నను నామసత్వము కలవాఁడని నా మనవి"

---

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము - 1960